శ్రీ వేఙ్కటేశాయనమః

# బాలచరితము

(మహాకవి భాసరచితమైన సంస్కృతరూపకమున
కాంధ్రానువాదము)

రచయిత

విద్వాన్

సూరిగుచ్చి కృష్ణమూర్తి, యమ్. ఏ. బి.ఓఎల్.

ప్రకాశకులు:
సూరం శ్రీనివాసులు.

[మూల్యము. 1–75.

# ప్రస్తావన

★

భాసమహాకవి గీర్వాణ భాషలో రచించిన బాలచరితమను రూపకమున కియ్యది తెలుఁగుసేత. యథామాతృకము.

కావ్యదర్పణ శృంగార ప్రకాశిక కావ్యాదర్శ కావ్యాలంకారసూత్రవృత్త్యాద్యాలంకారికగ్రంథము లందు భాసశ్లోకములు లక్ష్యములుగఁ జేర్కొనఁబడియున్నవగుట నీ భాసుఁడతిప్రాచీనమహాకవియని విమర్శకుల యభిప్రాయము. క్రీస్తునకుఁబూర్వ మైదారు శతాబ్దుల ప్రాంతమువాఁడని డాక్టరు టి. గణపతిశాస్త్రులవా రనిరి. కవికులగురువగు కాళిదాసమహాకవి తన మాళవికాగ్నిమిత్రమున నీ భాసుని ప్రస్తుతించుటఁ గందుము.

ఇంతవఱకి మించిన రూపకముల నీమహాకవి రచించె నను ప్రతీతిగలదు. కాని యీనాఁటికి లభించిన రూపకములీతనివని చెప్పికొనఁబడునవి పదమూఁడు మాత్రమే.

1. అభిషేకము, 2. అవిమారకము, 3. ఊరుభంగము, 4. కర్ణభారము. 5. చారుదత్తము, 6. దూతఘటోత్కచము, 7. దూతవాక్యము. 8. పంచరాత్రము, 9. ప్రతిజ్ఞాయౌగంధరాయణము, 10. ప్రతిమ, 11. బాల

చరితము, 12. మధ్యమవ్యాయోగము, 13. స్వప్నవాసవ
దత్తము ననునవి భాసరచితములైనవని ప్రసిద్ధినందియున్నవి.
ఇంకను యజ్ఞఫలము మున్నగు నాటకములుగూడ నీ మహా
కవిరచితములని కొందఱందురుగాని యిదమిత్థమని నిశ్చ
యింపఁబడలేదీనాఁటికిని.

మహాకవుల గ్రంథకర్తృత్వవిషయికముగ వివాద
మేనాఁడునున్నదే. బాలచరితము భాసరచనగాదనువాద
మును లేకపోలేదు.

భాసుఁడతిప్రాచీన రచయితయయ్యు నీతని రచనల
లోని వైశిష్ట్యము బహుముఖము. సామాన్యములగు రామా
యణ భారతగాథలనే తనరచనలయందితివృత్తములుగ
నిక్షేపించినను నీ తెఱఁగా గాథలలో మనోరంజకమైన
మార్పులను గూర్పులనుజేయు స్వాతంత్ర్యము నవలంబించెను.
ఈతని నాటకములఁ బఠించిన సహృదయుల కందలి రాసిక్య
మనుభూతమే యైయుండును. నాటకములం దాయాపాత్రల
ప్రసంగములు సుదీర్ఘములు గాకుండుటయు విశేషించి నాట
కములయందలి యంకములు చిన్నవిగనుండి ప్రదర్శనయోగ్య
ములుగ నుండుటయు గమనింపఁదగిన విషయములు. ప్రకృత
నాటకమైన బాలచరిత మీవిషయమున నగ్రస్థానము నంది
యున్నదనుట సత్యదూరముగాదు.

ప్రాక్తనదృశ్యప్రబంధలాక్షణికుల సిద్ధాంతములకు విరు
ద్ధముగ నీమహాకవి నిద్ర, వస్త్రధారణము, యుద్ధము,

వధయును విషయములను రంగస్థలముపై బ్రదర్శించుట యీతని నిరంకుశతకుఁ బ్రబలతార్కాణము.

పూర్వభాషా రచయితలు తమ నాటకములందమానుషవ్యక్తిప్రవేశ మసకృత్తుగఁ జూపుదురు. గీర్వాణ నాటకములం దిట్టిప్రవేశము సకృత్తుగ నేయున్నది. కాళిదాసమహాకవి తన శాకుంతలనాటకమునందు మేనకాప్రవేశము మఱియొకరినోటఁ జెప్పించెను. కాని సానుమతీప్రవేశము తిరస్కరిణీప్రభావమునఁ జేసెను. సానుమతి రంగస్థలముపై నున్న పాత్రలకు కనుపింపక కేవలము సామాజికులకే గాన్పించెను. ఇట్లే భవభూతి తమ రామునికాదివ్యక్తిప్రవేశము తన యుత్తరరామచరిత్రయందుఁ జేసెను. సీతయు నిట్లే తిరోహితయై తనభర్తనుజూచును, స్పృశించును. కాని శ్రీరామునకగోచరయైయుండునట్టి యమానుషశక్తిగలదానినిగ భవభూతి ప్రదర్శించెను.

షేక్స్పియరు తన నాటకములందిట్టి యమానుషవ్యక్తులను బ్రవేశపెట్టెను. మేక్బెత్ నాటకమునందు మృతుఁడైన బాంకో మానవాకృతితో నాసీనుఁడగు దృశ్యమొక్క మేక్బెతుకే గోచరమగునుగాని తదితరులకాయాసనము శూన్యముగనే గాన్పించును. ఇట్టి విచిత్రసన్నివేశము లీబాలచరితమునందు విశేషముగనున్నవి. మాతంగకన్యలు కంసునకేగాని మఱి యెరికిని గాన్పింపరు. మేక్బెతునకువలె దుర్నిమిత్తములు గంసుని నిధనమును సూచించును.

బాలచరితనాటకమునందలి యితివృత్తము శ్రీమ
ద్భాగవతమునుండి గ్రహింపఁబడినది. ఇందు వర్ణితములైన
శ్రీకృష్ణుని బాల్యక్రీడలు హరివంశమునందును విష్ణుపురాణము
నందును బ్రహ్మవైవర్తపురాణమునందు నుల్లేఖింపఁబడినవి

అనుశ్రుతముగ విన్పించెడి దేవకీవసుదేవుల కారా
గారవాసముగానీ కంసునకు భగినీభావుకులపైఁగల స్పర్థ
గానీ యీ బాలచరితమునందుఁ గాన్పింపవు. విశేషించి దేవకి
యిందు రాణిగఁ జేర్పఁబడినది. వసుదేవునకును గంసున
కును సేవ్యసేవకసంబంధమేగాని మామూలుగఁగథలలో
వినెడి పిఱికితనము వసుదేవునకు లేదు. ఇందలి వసుదేవపాత్ర
యుదాత్తమైనది.

పురాణములందు విన్పించెడి దుష్టరాక్షసుఁడు కంసుఁ
డిందుఁగాఁడు. ఇందలి కంసుఁ డభిమానియుఁ బౌరుషవంతుఁడు
నగు చక్రవర్తి, రాక్షసప్రకృతికి విరుద్ధమైనవాఁడును. ఇట్టివి
యింతకధికమగునట్టివియునగు విశేషము లీనాటకమునందు
బహుళములు.

ఈ బాలచరిత నాటకాంధ్రీకరణము పూర్తియైన
వెంటనే యాంధ్రాంగ్లేయభాషా విమర్శకులైన సహృదయు
లను గొందఱను దీనిని బఠింపవేఁడితిని. అంతియగాక సింహ
పురి యందుఁగల కొందఱు విద్వచ్ఛిరోమణుల నాహ్వానించి
వారిసమక్షమున దీనిని బఠించితిని. అవసరములగుపట్ల నట
నటవారి యనువాదమును మాతృకతోఁ బోల్చి విమర్శించిరి.

ఆ పండితులును విమర్శకులు నేతదాంధ్రీకరణ విషయమునం దమ సంతసమును బ్రకటించిరి. వారి యాశిషములే దీనిని నేను ముద్రించి వెలువరించుటకుం జాలవఱకు నిదానములు.

ఇయ్యవసరమున ముని ముందుగం బేర్కొనవలసిన వారు మన్మిత్రులు శ్రీ నల్లా శ్రీరామమూర్తి (బి. ఎ. బి. ఇడి.) గారు. సహృదయపూర్వకమైన వారి ప్రోత్సాహమే యీ రచనకుం బ్రధానకారణము.

గ్రంథముద్రణకై సర్వవిధముల నార్థికరూపమున సాయమొనర్చినవారు మా మిత్రులు శ్రీ సూరం శ్రీనివాసులుగారు.

ఇట్లు గ్రంథారంభమునకును ముద్రణమునకును గ్రంథ పరిశీలనమునకును దోడ్పడిన సరసులైన పండిత మిత్రులకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతములు. భగవంతుడు వారికి సర్వశుభము లొసంగుంగాక. వారి పవిత్రాశీస్సులే యీ గ్రంథ మాంధ్ర ప్రజానీకముయొక్క మన్ననల నందికొను నట్లనుగ్రహించునని విశ్వాసము.

సింహపురి
25–4–61

కృష్ణమూర్తి.



శ్రీ వేంకటేశాయ నమః

## మహాకవి భాసప్రణీతమైన బాలచరితము

# ప్రథమాంకము

---

( నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును )

ఉ॥ కాయము గౌరమై కృతయుగంబున నెవ్వఁడు తేజరిల్లె నా
రాయణ నాముఁడౌచు త్రిపదార్పితలోకుఁడు హేమమూర్తి త్రే
తాయుగమందు శ్యాముఁడయి దైత్యుని రాముఁడుచంపె ద్వాపరం
బౌయుగమందు కృష్ణుఁ డతఁ డంబుజదేహుఁడు ప్రోచుమిమ్ములన్ 1

సదస్యులకిట్లని విన్నవింతును. ఏమిది ? విజ్ఞాపనవ్యగ్రుఁడనగు నాకేదియో శబ్దము విన్పించుచున్నది ! తెలిసికొందు నిదే.

( తెరలో )

గగనసంచారుఁడను నేను.

సూ : తెరవెనుక నిష్క్రమించును.

తే. గీ. పుష్పవర్షమ్ము కురియుచుండె మొరయుచుండె
నాకమందున దేవతూర్యమ్ము లిపుడు
ఏగుదెంచెడి నారదుం డిటకు వేగ
ప్రేక్షకులముసఁ బుట్టిన కృష్ణుఁజూడ. 2

( నిష్క్రమింపుచు )

## ప్రస్తావన

( ప్రవేశము . నారదుఁడు )

నా :

తే. గీ. మూఁడు లోకాలు సర్వానియాడు సతము
గగనసంచారశీలుఁడ కలహప్రియుఁడ
బ్రహ్మలోకంబునుండి బయలుదేరి
భూమికేతెంచు నారదమునిని నేను. 3

వినుండిది.

తే. స్వర్గమందున దేవరాక్షసుల యుద్ధ
మాగిపోయిన దేనాఁడొ మొదిమొదలుగ
దేవపాత్రాలు తంత్రీనినాదములును
శ్రుతికి నింపవు వైరమ్ము చూపఁదలఁతు 4

అదియునుగాక.

## ప్రథమాంకము

ఉ. నాఁతిభక్తి బ్రహ్మతపసంబులయందుఁ దలంపఁగా సనం
ఖ్యాకములైన మౌనిజనగణ్య తపోవన పుణ్యభూములన్
బ్రాకటమైన భక్తిగలవాఁడనె కాని యథార్థమెన్నఁగా
ఏకరయుద్ధమే మదినభీష్టము హేయము వీరవాదముల్. 5

కావున జగత్పోషకాద్యుఁడై నాశరహితుఁడై, అవ్యయుఁడై, వృష్ణికులమందుఁ గంసవధార్థ ముదయించిన శ్రీమన్నారాయణుని దర్శించుటకై యిట కేతెంచితిని. ఎవరిది! పూజ్యురాలు దేవకీదేవి ఈమె. మాయాశిశురూపుఁడై జనించిన జగదీశ్వరు నొడిలోఁ బెట్టికొని వసుదేవునితో మందమందముగ నడుగులిడుచు గృహము నుండి వెలువడుచున్నది.

ఉ. ఎవ్వనిచే జగంబు పరిపాలితమౌ సురల్సదా
యెవ్వని దేవదేవుఁడని యెంతురు రాక్షసనాశకుండెవం
డవ్వనజాక్షుఁ డక్రనిశి హస్తములందున మందరాద్రినా
నివ్వనజాక్షి యెత్తికొని యేగెడి గోకము దాపుదాల్చినాన్. 6

ఇతఁడె భగవంతుఁడు శ్రీమన్నారాయణుఁడు.

తే. గీ. అధిక వీర్యుండు కమలపత్రాక్షుఁ డితఁడు
వాసవాదుల కధినేత వాసవారి
ముజ్జగము వైజయంతిక పూర్వపురుషుఁ
డితఁడు స్రష్ట జగత్తును గతియుఁ బతియు. 7

ఇంక నేమి? కలహకారణ ముత్పన్నమే యైనది. భగవంతుఁడగు శ్రీమన్నారాయణునకుఁ బ్రదక్షిణ మాచరించి నేనిదే బ్రహ్మలోకమున కేఁగెదను. త్రిలోక సృష్టికారణుఁడగు శ్రీమన్నారాయణున కిదే ప్రణామము.

ఉ. సారసపత్రలోచన విశాంపతి లోకశుభంకరుండ, దై
త్యారిని రావణాసురు మహాహవ మందున గెల్చినట్టి రా
మా, రఘువంశసోమ, యసమాన బలాంచిత నీకిదే నమ
స్కారము స్వీకరింపుము జగత్పతి నిన్గనియాడ శక్యమే. 8

( నిష్క్రమించును )

( బాలు నొడిలో నుంచుకొని దేవకి ప్రవేశించును )

దేవకి : అయ్యో. నాకుమారుని జనన సందర్భమునఁ గన్పించిన శుభశకునములు శిశువుయొక్క మహానుభావతను జాటుచున్నవైనను దురాత్ముఁడైన కంసుని క్రౌర్యమును దలంచికొని విశ్వసింప లేకున్నాను మందభాగ్యురాలను. ఆర్యపుత్రుఁ డెట కేఁగెనో? (నడచిముందుఁజూచి) ఇదే సంతోషవికసిత నేత్రుఁడై ఇటే వచ్చుచున్నాఁడు!

( ప్రవేశము : వసుదేవుఁడు )

వ : అహో ! ఏమిది ?

ఉ. భూమి పరిభ్రమించెడి ప్రభూతవియత్తల చంచలాకులో
ద్దామ ప్రచండవాయునదితంబగు నూతన మేఘగర్జనన్
ఈమహా, రాక్షసాళి మథియించి ప్రజాహితమున్ ఘటింపఁగా
నేమొ జనించె విష్ణువని యిత్తఱినామదిఁ దోచుచుండెడిన్. 9

(చూచి) ఇదే దేవకి ;

చం. తనసుతులార్వురాపగిది దారుణహత్యకు లోనుగాఁగ నిం
తని వచియింపరాని మరణాంతపు దుఃఖము నాచికొంచు, మా
నిని యిదె సప్తమాత్మజు ననిందితజన్మనిమిత్తు నాత్మసం
దనుఁడను పేరఁగంసనిధనంబును మోయుచు నేఁగుదెంచెడిన్. 10

దేవకి : (సమీపించి) జయమార్యపుత్రులకు.

వసు : ఇది యర్ధరాత్రము దేవకీ, మధురానగరము సుఖ
నిద్ర మునింగియున్నది. ఏరును జూడకముం దీబాలు
నిటనుండి తీసికొని పోయెదను.

దేవకి : ఆర్యపుత్రుఁడెటకీ బాలుని గొంపోవుట ?

వసు : సత్యము వచింతును దేవకీ, నాకును దెలియదు. కం
సుఁడేకచ్ఛత్రాధిపతియై జగదేక శాసకుఁడుగ
నున్నాఁడు. మఱి యీబాలు నెటకుఁ గొంపోవుట ?
కానిమ్ము దైవమెటకీడ్చుకొని పోవునో యటకే యీ
బాలుని గొంపోయెదను.

దేవకి : ఆర్యపుత్రా యీ శిశువును నేనే పరిరక్షింపఁ దలఁతును.

వసు : ఏమి నీయతిపుత్రవాత్సల్యము దేవకీ,

తే. గీ. రాహువదనంబుసం దుడు రాజితండు
అనుచు నిసుతు నెఱుఁగుమో యుంబుజాక్షి
కన్న కడుపని తీపెంత యున్నఁగాని
కంసుఁడీ బాలు మృత్యువు కావె తలఁప. 11

దేవకి : అసంభవమది.

వసు : తథాస్తని దేవతలాశీర్వదింతురు గాక. ఇమ్ము బాలుని.

దేవకి : ఎత్తుకొనుడు. (ఇచ్చును)

వసు : (ఎత్తికొని) ఏమి యీబాలుని బరువు!

తే, గీ. పద్మదళలోచనుండగు బాలుఁడితఁడు
వింధ్యమందరసారుఁడో వీరుఁ డితని
నెలుల గర్భంబునన్ ధరియించె నీవె
తెలియ శక్యమె యువతుల ధీరగుణము. 12

లోనికేఁగుమిఁక దేవకీ.

దేవకి : పోవుచుంటి నిదే నిర్భాగ్యురాలను. (పోవును)

వసు : (చూచుచు) ఈ దేవకి

తే. గీ. హృదయమిచ్చట నంగమ్ము లచటఁ జూడ
వ్యక్తు లిద్దర వోలెఁ గస్పట్టు సకట.
ఆకసంబునఁ దోయంబునందుఁ గూడ
చంద్రబింబంబు గస్పట్టు సరణి జగతి. **13**

పోయినదీమె లోపలికి. నగరద్వారము వైపునకు నేనును బోయెదను- ఇపుడు.

తే. గీ శిశువులాద్వరఁ జంపిన చెనటి కంసుఁ
డనుచు భయదుఃఖములు పిరిగొనఁగ నేను
మందరాద్రిని బాహువులందు నెత్తి
కొన్నరీతిని బాలుని గొనుచుఁ బోదు. **14**

(నడచి) ఇదె నగరద్వారము ప్రవేశింతును.
(ప్రవేశించి) ఆహా మధురానగరము గాఢసుషుప్తిలో మునిఁగియున్నది. తగిన సమయము నేనేఁగుటకు. పోయెదను. (నడచి) పట్టణము దాటి బయటపడితిని. ఏమి యీగాఢాంధకారము!

తే. గీ. అంధకారమ్ము అంగంబులందుఁ బూయు
సటుల, నభము కాటుక గాద్పు సటుల నుండు;
నేత్రములు రెండునుండియు నిష్ఫలమ్ము
కుజను సేవించు నాతని కొలువు వోలె. **15**

ఏమి యీతమఃప్రభావము!

తే. గీ. కానుపించవు దిశలు, వృక్షమ్ములెల్ల
నిటు ఘనీభూతముగఁదోచు నిపుడు సహజ.
రామణీయకమైన యీప్రకృతియెల్ల
నింత విపరీతరూపమ్ము నెటులఁ దాల్చె. 16

కాలాడకున్న దీకటికటిక చీకటిలో (చూచి) ఏమి యీ దీపకాంతులు! దురాత్ముఁడైన కంసుఁడు నానగర నిష్క్రమణ మెఱింగి దీపపు వెలుఁగులలో ననుఁ బట్టికొనుటకు వచ్చుచున్నాఁడు గాఁబోలును. కాని మ్మాతని దర్పమడంచెద (ఒరనుండి కత్తినిలాగి వెను దిరిగిచూచి) ఏమిది? ఒక్కఁడును గాన్పించఁడు! (వెలుఁగునుజూచి) ఇది యింకను నాశ్చర్యము!

తే. గీ. అంధకారమ్మిదెల్లెడ నావరింప
దారిఁ గనలేని నాకుఁ గుమారుఁడిపుడు
నడువ వెలుఁగులఁ జూపుచున్నాఁడిదేమి
తన శరీరప్రభాపుంజమును వెలార్చి. 17

ఇదే మార్గము నడచెదను. (చూచి) అయ్యో పవిత్ర యగు నీయమునా స్రవంతి సకాలవర్ష జలపూర్ణమై యున్నది. నాపడిన శ్రమయంతయు వ్యర్థమేయగునా? కర్తవ్యమేమి? (ఆలోచించి) అవును స్ఫురించినది.

చ. రయవిచలన్మహోర్మికలు గ్రాహభుజంగమ దుష్టజంతు సం
చయమును గల్గు నీ యమున సాధ్యమె దాటఁగ నూహఁ దోఁచనే
లేయు, ఏఁక కార్యసిద్ధికి, ననిందితమద్భుజయుగ్మశక్తి యు
న్నయసపు సాధసంజగుత నాకిపు డాపయి దైవముండెడిన్. 18

(నదిలోదిగి ఆశ్చర్యముతో) ప్రవాహము రెండు పాయలుగఁ జీలినదేమి? ఇటుప్రక్క జలమీ ప్రక్క నే ప్రవహించుచున్నది. నాకు మార్గమిచ్చినదీ నదీదేవత. నడచి పోయెదను. (దిగినడచును) యమునదాటి యీ వలి యొడ్డు చేరితిని. (వినుటనభినయించి) ఈ హుం కారశబ్దమేమి యిట? నిర్భాగ్యుఁడనగు నేను గొల్ల పల్లెదరికి వచ్చితిని. కానిమ్ము, ఈఘోషమునందే నా ప్రియమిత్రుఁడు నందగోపుఁడున్నాఁడు. అయిన- కంసాజ్ఞచే నేనాతనిని బంధించి కశాఘాతము చేసితి నొకసారి ఈపల్లెకే పోయెదను. ఒకవేళ వసుదేవుఁడీ యర్ధరాత్రమున వచ్చెనని గోపాలురందఱును భీతు లగుదురేమో! అందుకని యీమఱ్ఱిచెట్టుక్రింద నే తెల్లవాఱువఱకు వేచి యుందును. ఓన్యగ్రోధ దేవత లారా! లోకహితార్థమీ బాలుఁడు కంసుని వధించు టకే జనియించుట సత్యమేని యీ ఘోషమునుండి యొక్కని నిటకంపుఁడు...ఎవఁడో రానేల? నాప్రియ మిత్రుఁడు నందగోపుఁడే రావలెను.

(మృతశిశువును బట్టుకొని నందగోపుఁడు ప్రవేశించును)

నందగోపుఁడు : (దుఃఖముతో) బిడ్డా! నీవు మా గృహలక్ష్మివై మమ్మానందింపఁ జేయక విడచి పోవేల? ఏమి యీ యాంధకారము; నూరుకాంతులనుగూడ నతిశయించి యున్నది.

తే. గీ. ప్రావృడంభోద పిహితచంద్రాతపమ్ము
గాన రజని నిమీలితాకార మయ్యె
నీలవస్త్రంబు కాయంబు నిండ గప్పి
పవ్వళించిన గోపికాభామ భాతి. 19

ఈ యర్ధరాత్రమున నా భార్య యశోద యాఁడుశిశువును ప్రసవించినది. పుట్టినమాత్ర నీశిశువు మరణించినది. రేపు మా పల్లెవారందఱును ప్రత్యుత్థమును నుత్సవమును జరుపఁదలఁచిరి. కాన నీశిశుమరణదుఃఖము మావారందఱును బంచికొనకుండ నుండుటకై యీ మృతశిశువు నింటినుండి తీసికొనవచ్చితిని... పాపము; ప్రసవవేదనాభారాలసతచే మూర్ఛితయై పడియున్న యశోదకుఁ దాను గన్నది దారికయో దారకుఁడో యనునదియుఁ దెలియదు. అయ్యో బిడ్డా. (ఏడ్చును.)

వసు : ఎవ్వఁడీ యర్ధరాత్రమున నిట విలపించువాఁడు?

ఈశ్వరుఁడును నావంటి దుర్భాగ్యుఁడై యుండఁడనో ప్రభూ!

నం. గో: (దుఃఖముతో) నాయింటియందు క్రీడించుచు మమ్ము సంతోషపఱుపక మోసగించితివేమి బిడ్డా?

వసు: స్వరమునుబట్టి నాప్రియమిత్రుఁడు నందగోపుఁడే యీతఁడని తెలియుచున్నది. ఆయనను బిలచి చూచెద. మిత్రమా; నందగోపా; ఇటురావోయి.

నం. గో (భయముతో) అయ్యో! ఎవరిది? పరిచిత పూర్వమైన స్వరముతో నందగోపా, నందగోపా యని పిలుచునది నన్ను! రాక్షసుఁడో? లేక పిశాచమా! భయంకర కాళరాత్రి- చేతులయందు మృతశిశువు! అయ్యో; నేమిచేయుట యిప్పుడు,

వసు: మిత్రమా; నందగోప, అన్యథా భావింపకుమయ్యా, రమ్మిటకు.

నం. గో. (చెవియొగ్గి విని) అయ్యో ప్రభువు వసుదేవుఁడని స్వరమునుబట్టి తెలియుచున్నది. సమీపింతును. అయిన నేనీతని కడకుఁబోయి చేసెడి దేమి? కంసుని మానతి నీతఁడొకప్పుడు కోపిష్ఠుడైన నన్ను కొరడా దెబ్బలు కొట్టి బంధించెఁగదా కావున నేనేఁగ నీతని కడకు... అయిన, ఏల నాకీ యల్పబుద్ధి, ఎన్నియుప

కారములు మున్నితఁడు నాకుఁ జేసియుండలేఁడు?
నాకు సంతోషము గల్గినపుడితఁడు నానందించెను.
కష్టము గల్గినపుడితఁడును దుఃఖించెను. ఒక్కసారి
రాజశాసమున నీతఁడు నన్ను శిక్షించినంత నేమయ్యెను?
ఈతని కడకేఁ గెడను. మఱి యీబిడ్డనేమి చేయుట!
కానిమ్మిట్టులఁ జేసెదను. (సమీపించి చూచి ఆశ్చర్య
ముతో) ఏమి తెల్లవారినది యేమి? ఎక్కడిదీ వెలుగు!
వసుదేవప్రభుపు శిశువును చేతిలోనుంచుకొని
యున్నాఁడేమి? (సమీపించి) ప్రభుపులకు విజయము.

వసు : దేవతామూర్తులైన మీగోవులన్నియుఁ గుశలమా
నందగోపా.

నం. గో : చిత్తము ప్రభూ కుశలమే.

వసు : పరిజనులకు మీకు కుశలమేగదా!

నం. గో : ఏమి? పరిజనులనియా? కుశలమే ప్రభూ!

వసు : ఏమిది మిత్రమా దాచుచున్నట్లుంటివేదియో?

నం. గో : మరేమియును లేదు స్వామీ.

వసు : సత్యము వచింపవని చో నామీద ఒట్టే.

నం. గో : ఇది యేమి పాపము స్వామీ, చిత్తగింపుఁడయిన.
నేటి యర్ధరాత్రమున నాభార్య- కాదు కాదు, మీ

దాసి, యశోద యీ మూడు శిశువును ప్రసవించినది. పాపమీ శిశువు పుట్టగనే మరణించినది. రేపు మా పల్లెలో నింద్రయజ్ఞమను మహోత్సవము జరుగును. కావున మా యాభీరజన మీ శిశుమరణ దుఃఖమునకు సానుభూతిని జూపకుందురన్న నడువఁగాళ్ళు రాక యున్నను నేనే రాకిన్నై యీ దారికను దీసికొని వచ్చితిని. పాపము యశోదయుఁ దాను ప్రసవించిన దారికయో దారకుఁడో యెరుగనే యెరుగక మూర్ఛితయై పడియున్నది.

వసు : ఎంతకష్టము? మృత్యువు నెవ్వఁడు వంచింపఁగలఁడు? మిత్రమా కాష్ఠభూతమైన యీ మృత కళేబరము నావలఁ బారవేయుము.

నం. గో : పారవేయలేను ప్రభూ.

వసు : లోకధర్మమేయిది. పారవేయుము.

నం. గో : ప్రభువుల చిత్తము అయ్యో బిడ్డా (ఏడ్చును)

వసు : ఏడ్చి ఫలమేమి? లెమ్ము నందగోపా.

నం. గో : (లేచి సమీపించి) ఈ దాసుని కర్తవ్యము స్వామీ.

వసు : నీకును దెలియునుగదా నందగోపా కంసహతకుఁడు నాయార్వుర పుత్రులను బొట్టను పట్టుకొనెనని.

నను : నీవతి బలపరాక్రమసంపన్నుఁడవసి నేనెఱుఁగనా మిత్రమా.

గం. గో : ఇదే వినుఁడు నాబలము స్వామీ. కొమ్ములతో భూమిని త్రుళ్ళగించొడి బలీవర్దములను గొమ్ములఁ బట్టి గెంటి వేయఁగలను. బురదలో కూరుకొనిపోయిన బండిచక్రముల నెత్తివై చెదను. అంత బలవంతుఁడ నీశిశువు నెత్తికోలేకున్నాను స్వామీ. నాచేత నగు నట్లు లేదు.

(గరుడునితో పంచాయుధములు ప్రవేశించును.)

గరుడుఁడు :

ఉ. ఏను సుపర్ణనాముఁడ నతీంద్రియవేగ సమన్వితుంశఁ దే
జోనిధి శార్ఙధన్వుని విశుద్ధరథంబయి కేతనంబునై
దానవ నిర్జరు ల్వ్యూహవిధంబుల మున్ను రణంబు సేయునాఁ
డానలినాక్షు మోసితి మహద్భుతవిష్ణుబలంబు లోడుగాన్. 21

చక్రము :

తే. గీ. ఏను శ్రీకృష్ణుకరముల నెనయుచుండు
చక్రనాముఁడ మధ్యాహ్నసప్తహయుని
యుగ్రతేజంబుఁ దాల్తు పీయూషమథన
సమయమున నిర్జరారులఁ జంపినాఁడ. 22

శార్ఙ్గము :

ఉ. నన్నుమువారె నాసడు మఱ్ఱసము విష్ణువు కేలఁబట్టుట
న్నన్ను, దురంతరాక్షసగణంబులతో సని సేయునప్పుడున్
ఎన్నబలంబునందుఁ బరిహీనత గల్గదు సుంతయేనియున్
వెన్నునికృప స్తయింతు నరివీరనికాయముసెల్లఁ బెల్లుగన్. 23

కౌమోదకి :

తే. గీ. శ్రీమహావిష్ణునాజ్ఞ నశేషరిపుల
ఘోరరణరంగమునఁ గలగుండు పఱచి
అమరరిపురక్తనిమ్నగలందు మునుఁగు
గదను కౌమోదకినామఘనతఁ గందు. 24

శంఖము :

కం. క్షీరాబ్ధినుండి హరిచే
గారామున నెత్తఁబడిన కంబువు నౌదున్
నారావ మింత విన్న నె
యారాక్షసకులము భస్మమయ్యెఁడు నాజిన్. 25

నందకము :

తే. గీ. ఏను నందకనాముఁడ నెదురు లేఁడు
సంగరంబుల నొక్కఁడు సర్వజగతి
విష్ణుదేవుండు స్మరియింప వేగఁ జనుచు
సమరభూమిని సాయంబు సలుపువాఁడ. 26

చక్రము :

> తే. గీ. చక్రశార్ఙనందక గదాశంఖములను
> శస్త్రములము మనమసుర శాసకులము
> వాసుదేవ నిమిత్తమై వచ్చినాము
> దేవదేవుని సభను వర్తింతు మెపుడు 27

కావున రండిదే మనుష్యలోకమున నవతరింతము. గోపాలవేషప్రచ్ఛన్నులమై ఘోషమునందే యవతరించి యట భగవంతుడైన శ్రీమన్నారాయణుని బాలచరితము ననుసరింతము రండు.

అందరు : అట్లే (అని విష్ణుని సమీపింతురు.)

వసు : ఈ బాలుని నమస్కరింపు మిత్రమా.

నం. గో : చిత్తము ప్రభూ. రాజదారక నమస్తే. నమస్తే. (నమస్కరించును) నిన్ను నీవే భరించుకొనుము తండ్రీ. గోపాలమాత్రులము మాకా నిన్ను భరింపఁగల బలపరాక్రమములు.

చక్రము : నమో భగవతే నారాయణాయ. దేవా

> తే. గీ. దేవరాక్షసకోటికి నీవ కాదె
> సర్వమును నిర్ణయించెడి శాసకుఁడవు
> ఓయి యదువంశకేతువ, మోయలేఁడు
> నందగోపుఁడు చులుకపసంబు గనుము. 28

వసు : ఎత్తికొనుమీ బాలునిపుడు, నందగోపా.

నం. గో : చిత్తము. (ఎత్తికొనును)

వసు : తెల్లవారినది నీవిఁక నింటికేఁగుము.

నం. గో : (చూచి యాశ్చర్యముతో) ఈవింత గనుఁడు ప్రభూ, ఈబాలిక బంధనములూడి క్రిందఁబడినవి.

వసు : ఇదియంతయు బాలుని ప్రభావము నీవేగుము.

నం. గో : చిత్తము. (పోఁబోవును)

వసు : ఇటు రమ్మొక మాట.

నం. గో : చిత్తము. ఏమి స్వామీ.

వసు :

తే. గీ. ప్రకృతిచేతనె వాత్సల్యపరుఁడ వీవు
కలదు మైత్రియు నాపైనఁ గాన వినుము
దగ్ధశేషంబు రక్షింపఁదలఁచి పుట్టి
ప్రాణరక్ష యాదవులకీ బాలుఁడేయి 29

ఎట్లు పోషింపఁదలఁతు వీబాలుని ?

నం. గో : ఆలకింపుఁడు స్వామీ, మాగొల్లపల్లెలో నొక యింట పాలుద్రావును, వేఱొకయింట పెరుగు దినును, మఱొక్కయింట వెన్న నారగించును, ఇంకొకయింట పాయసము జుఱ్ఱును. ఇంతయేల ప్రభూ మాగొల్లపల్లెకే బాలుఁడేనుగడ.

వసు : అక్కో కానిమ్ము మఱలి పొమ్ము నీవిఁక.
నం. గో : చిత్తము. (నిష్క్రమించును)
వసు : నిష్క్రమించెను నందగోపుఁడు. నేనును మధురకే పోయెదను. (నడచి, విని) ఈరోదన శబ్దమేమి? కంస భయముచే నందగోపుఁడేడ్చుచుఁ దిరిగి వచ్చు చున్నాఁడా గాఁబోలును- (నడచి, చూచి) బ్రతికినట్లు న్నదీ బిడ్డ. (ఆలోచించి) ఈ బాలికను దేవకి యొడిలోఁ బట్టి కంసుని ప్రతారించెదఁగాక. (బాలిక నెత్తికొని) ఇంతటి గురుత్వమేమి యీబాలికకు నేమోయలే నట్టిది? అయినను; కుమారునివలె నిదియు నీపద్భేదము గల యొక దైవతమే. ఎత్తికొని మధురకేగెదను. (నడచి) ఏమి యీయమునాస్రవంతి యడ్లు పాయలుగ నిలచియున్నదిఁకను! దాటెదను. యమున దాటి యీవలకు వచ్చితిని. ఇదేనగర ద్వారము. మధురా వాసులింకను సుషుప్తిలోనే యున్నారు. నగరము లోని కేఁగెదను. (ప్రవేశించి) ఇదే నృశంసుఁడైన కంసుని భవనము జ్యోత్స్నాశ్రితమువోలెఁ గాన్పించు చున్నది. (మఱియొకప్రక్క జూచి, ఇది మాయిల్లు శ్రీనివాసమై యొప్పుచున్నది. గృహములోని కేఁగి దుఃఖితయైన దేవకి నోదార్తును. సర్వేశ్వరుఁడు శుభ ములు ప్రసాదించుఁగాక. (నిష్క్రమించును)

ప్రథమాంకము సమాప్తము.

# ద్వితీయాంకము

(మాతంగయువతులు ప్రవేశింతురు)

మాతంగస్త్రీలు : రమ్మ్మ కంసరాజా రమ్మ్మ, కన్యలమైన మమ్మ్మ పెండ్లాడుము.

(రాజు ప్రవేశించును)

రాజు : (ఆశ్చర్యముతో)

చ. ధర యిటు ఘూర్ణితంబగు నతర్కితరీతిని సౌధపంక్తులున్
గరము చలించి కూలె తరఁగల్ పటునావను [illegible]యుండు ని
త్తరి శకునంబులేమి ఫలదానముఁ చేయుఁ సుఖంబొ దుఃఖమో
యరయఁగఁజాల ముందుఁగల యర్థమ దెట్టిదొ కానరాదుగా 1

మాతంగస్త్రీలు : రమ్మ్మ రాజా, రమ్మ్మ. మేము కన్యకలము వివాహమాడుము మమ్మ్మ.

రాజు : (మాతంగ కన్యలనుజూచి)

ఉ. లేరిటరక్షిపూరుషులు. లేరు కరాగ్రనితాంతదీపికా
ధారిణులౌ భుజిష్యవనితాగణము ల్భవనాంగణంబునన్,
ఆరయఁగారణంబిదియ శ్యామశరీరలు నంజనాభలౌ
వీరిటు మందిరాంతరప్రవేశమొనర్చుట కక్కజంబుగన్ 2

మాతంగస్త్రీలు : రమ్మ్మ మహారాజా; పెండ్లి చేసుకొమ్మ్మ మమ్మ్మ.

రాజు : సృష్టింపఁబడినట్లున్నదీ మాతంగ యువతులు!

ఉ. ఎవ్వని క్రోధవృష్టి శమియింపఁగఁ జేయు ముహూర్తమాత్రనే
యివ్వసుధారివర్గము, దినేశహిమాంశుహుతాశనాదులున్
ఎవ్వని దానదాసులిఁక మృత్యువు కెవ్వఁడు మృత్యురూపుఁడో
అవ్వసుధేశు నన్ను దరియంగను దూషితుఁజేయ శక్యమే. 3

మాతంగస్త్రీలు : రమ్ము ప్రభూ రమ్ము.

రాజు : పొందు మీరిటనుండి- (చూచి) ఎట్లదృశ్యులై రింత త్వరఁగ! ...గృహాభ్యంతరమున కేఁగెదనిప్పుడు.

(శాపము ప్రవేశించును)

శాపము : ఎట కేఁగెదవోయి రాజా యిది నాయిల్లు!

రాజు : (చూచి)

ఉ. ఈతఁడెవండు గన్పగృహమీగతిఁ జొచ్చెడి శంకలేక యు
ల్కాతతిఁ జేతఁ దాల్చి కడులావుసఁ గజ్జలవర్ణదేహుఁడై
వీతభయాతివేగుఁడయి భీకరదంష్ట్రుఁడు పింగళాక్షుఁడై
ఈతఁడు నన్నుఁ జేరెడి మహేశ్వరుమూఁడవకంటిమంటనాన్. 4

ఎవ్వండవు నీవు ?

శాపము : నన్నే యెఱుఁగవా! మహర్షి శాపమును, వజ్రబాహుఁడు నాపేరు.

తే. గీ. ఇదె శ్మశానమునందుండి యేఁగుదెంతు
చండహాసాన, చండాలసదృశరూపి,
నేఁ గపాలమాల ధరించియుందు వత్తు
కంసరాట్చిత్తమునఁ జొరఁగాఁ దలంతు. 5

రాజు : ఎంతటి యసంభవకార్యమునకుఁ గడంగితివి

శా. హైమప్రాభవకూటకందరము రమ్యాలోకగుల్మప్రభా
ధామంబౌ కుధరమ్ము మేరువు గరువ్వాతంబుచే వాయునం
బేమైనన్ జలియింపఁజేయునటె యింతేఁ దుంగరంగత్తరం
గామేయోదధివారిఁ గ్రోలఁజనుమూర్ఖా పామ్ము హాస్యాన్పదా. 6

శాపము : నమయము వచ్చినప్పుడెఱుంగఁ గలవు లెమ్ము.
(తిరోహితుడై యుండును)

రాజు : ఏమి అప్పుడే సురిగిపోయెనే! పోనిమ్ము. శయ్యాతల
మున సుఖముగ నిద్రింతును. (నిద్రనభినయించును)

శాపము : నిద్రించినాఁడీతఁడు. అలక్ష్మి, ఖలతీ, కాళరాత్రి,
మహానిద్రా, పింగళాక్షి రండిటకు మీరందఱును
మందిరములోనికేఁగుదము.

(రాజశ్రీ ప్రవేశించును)

రాజశ్రీ : (శాపమును జూచి) లోపలకుఁ బోరాదు.

శాపము : ఎవరమ్మా నీవు.

రాజశ్రీ : నన్నెఱుఁగవా, ఈకంసరాజు లక్ష్మిని.

శాపము : అగును, నీవు రాజలక్ష్మివి. తొలఁగుమమ్మా,
యీభవనము నాస్వాధీనమైనదిపుడు.

రాజశ్రీ : ఛీ,

శా. అలంకాపురిఁ బోలు మద్గృహము మూఢా యిద్ది నీవెట్టులో
రీలోనేఁగఁగలాఁడ వీచొఱవ కీవెవ్వాని కాళ్లంటితే
లా లావుల్పలుకంగ నిట్టు లిది నాయావాస మేనుండ నీ
కీలోనన్ జొరఁ జూడఁగా వశమె పొమ్మింకేల నీవుండఁగన్ ॥ 7

శాపము: తల్లీ, లక్ష్మీదేవీ, నీవీకంసశరీరము విడువ వల యును. ఇది భగవానుఁడగు విష్ణువు నాదేశము.

రాజశ్రీ: ఏమి విష్ణుదేవునాజ్ఞయా? అయ్యో ఎంతకష్టము.

కం. చిరసహవాసముగలుగుటఁ
దరమే విడువంగఁ గంసధరణీపునితనిస
అరుదగు గుణగణములచేఁ
బరిబంధితనైతి వీనిఁ బాయఁగ వశమే. 8

అయిన ననతిక్రమణీయము. వైష్ణవాదేశము. ఆ విష్ణు దేవునికడకే యేఁగెదను. (నిష్క్రమించును)

శాపము: వెడలిపోయినది రాజలక్ష్మి. ఇంకనీభవనము మా సర్వస్వము. అలక్ష్మి, ఖలతీ, కాళరాత్రీ, మహానిద్రా, పింగళాక్షీ రండు గృహాభ్యంతరమునకేఁగి మన జాత్యుచితముగ స్వైరవిహారము చేయుదము.

అందఱు: (కంసునిఁజూచి) నేఁటినుండి చరిత్రహీనుఁడవు గమ్ము రాజా.

ద్వితీయాంకము

శాప: తే.గీ. కలుషచరితుండవైతివో కంసరాజ
అమధూకుని శాపమ్ము నైన నేను
గాఢసంశ్లేషమొనవింతుఁ గాన నీవు
నాశ మొందెద వచిరమ్మె నమ్ము మిద్ది. 9

(అంతర్ధానమగును)

(ప్రతీహారి ప్రవేశించును)

ప్రతీ: (కంసునిఁజూచి) ప్రభువులకు జయము.

కంస: ఎవరు నీవు!

ప్రతీ: నేను యశోధరను ప్రభూ.

కంస: అటులా, అయిన యశోధరా ఆవచ్చిన మాతంగ కన్యలను నీవు చూచితివా?

ప్రతీ: మాతంగకన్యలా ప్రభూ! నిత్యమును దేవపాదసన్నిధిని దిరుగువారలకే తను దర్శనము దుర్లభము. మఱి మాతంగకన్యలు వచ్చిరందురేమి స్వామీ.

కంస: స్వప్నము గంటినేమో. బాలాకిని రమ్మనుము యశోధరా.

ప్రతీ: చిత్తము. (నిష్క్రమించును)

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచు: విజయము మహారాజులకు.

కంస : బాలాకీ, పెనుగాలి, భూకంపము, ఉల్కాపాతము, దైవత ప్రతిమలు ననువిషయములు నాకనుభూతము లైనవి యీరాత్రి. నీవు జ్యోతిష పురోహితులకడకుఁ బోయి వీనిఫలమును దెలిసికొని రమ్ము.

కాంచు : మహారాజా వారావిషయమై మనవి చేయు మన్నారు.

కంస : ఏమని ?

కాంచు : చిత్తగింపుఁడు

శా. ఆకాశంబుననుండి భూతమొకఁడయ్యా రాజ కార్యార్థ మీ
భూలోకంబున నూడిపడ్డదిట కల్లోలంబుగా దుందుభుల్
భూకంపంబులు పెల్లురేగినవి సమ్మోహించె లోకంబులు
త్సేకంబున్మై అయ్యంగ బాలజనన ప్రోలబ్ధమోదంబునన్. 10

రాజు :

తే. గీ. ఎవని జన్మంబుకతన నీయవనియెల్ల
శైలసహితంబుగా నిటు సంచలించె ?
ఎవని పుత్త్రుండొ యాతఁడు ఎఱిఁగి రమ్ము
ఇట్టి జన్మకుఁ గారణమేమొ గనుము. 11

కాంచు : చిత్తము. (నిష్క్రమించి మరల ప్రవేశించును) మహారాజులకు విజయము. దేవకి ప్రసవించినది.

రాజు : ఏమి శిశువు.

కాంచు : ఆడు శిశువు.

రాజు : అసత్యము. ఆమశిశువు జనించుటచే నిట్టి మహాద్భుత శకునములు సంభవించునా ?

కాంచు : అనుగ్రహింపుఁడు, ఎన్నఁడు నసత్యమాడినవాఁడను గాను. తమభృత్యవర్గముచేఁ బరివేష్టింపఁబడిన దాదియొడిలోనుండఁగ నేనాయాఁడుశిశువును జూచితిని.

రాజు : భూసురులనోటి యసత్యమైనను సత్యమేయగును. వాన్ని వసుదేవుని మాయాజ్ఞగఁ గొనిరమ్ము.

కాంచు : చిత్తము (నిష్క్రమించును)

రాజు : వసుదేవుఁడు సత్యవాదియు ధర్మశీలుఁడును. నాతో ననృతము పలుకఁడు. కానిమ్మాతనినోటినుండియే సర్వమును విందును.

(వసుదేవుఁడు ప్రవేశించును)

వసు : (తనలో)

తే. గీ. చివికి యీ శరీరమ్ము కృశించెనిట్టి
కనుల షట్పుత్రమరణంబు కాంచి కాంచి
కంసరాజేంద్రుఁడితఁడు నిష్కరుణుఁడరయ
నితని పంపున సేవకు గతిని బోదు. 12

లోకప్రవృత్తియే యిట్టిది.

తే. గీ. రాజశబ్దంబె భయదంబు శ్రవణములను
వినిన వినకున్న అందరకును ధరిత్రి
భీతిచెందిన లేకున్నఁ బిలచె నేని
చనక తప్పదు రాజశాసనము రెంట. 13

(రాజును సమీపించి ప్రకాశముగ)

వచ్చితిని శౌరసేనీపుత్రుఁడా.

కంసు : కూరుచుండుము యాదవీపుత్రా.

వసు : అట్లే (కూరుచుండి) మమ్ము పిలిపింపఁ గారణము ?

కంసు : ప్రసవించెనా దేవకి ?

వసు : ప్రసవించినది.

కంసు : ఏమి శిశువు.

వసు : (తనలో) అనృత మాడవలసివచ్చినది. కానిమ్ము బాలరక్షణార్థము వచించినది యనృతమైనను సత్యమే యగును. ఏమని చెప్పుదును- ఇట్లు చెప్పిచూచెదను. (ప్రకాశముగ) ఆడుశిశువును గన్నదామె.

కంసు : తే. గీ. కూఁతురైనను గానిమ్ము కొమరుఁడైనఁ
గాని చంపక తప్పదేమైనఁగాని
దైవ మేరీతిఁ దలఁచిన దాని నేను
పౌరుషము చూపి వంచింప వలతునిపుడు. 14

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీ : ప్రభువులకు జయము. మా రాణి విన్నవించుచున్నది. ఆశిశువనియు మహారాజులను గ్రహింపవలెననియును.

వసు : శౌరసేనీపుత్రా, పాపమీ దేవకికోర్కె మన్నింపుము. తల్లుల కాబిడ్డలయందు మమకార మధికతరము.

కంస : నీవానర్చినసమయము మఱచితివా?

తే. గీ. ఋషి మధూకుండు నాఁడు నాకిడిన శాప
సమయమున నాకు జేసిన సమయ మేమి?
దేవకీగర్భములనెల్లఁ దెచ్చి యిత్తు
ననుచు బల్కిన నాలుకేమాయె నిపుడు. 15

వసు : సమయమా అయిన గాదని యనను.

ప్రతీ : మా రాణి కేమని సెలవిత్తురు?

కంస : యశోధరా యిట్లని వచింపుము. ఈవిషయమున నింతయు నెదురుచెప్పవలదనియు వేఱొకయభీష్టము మన్నింతు ననియును.

ప్రతీ : చిత్తము!

కంస : దారికనిమ్మనుము యశోధరా.

ప్రతీ : అవశ్యము ప్రభూ

వసు : (తనలో) మనశ్శాంతిని గోరు నాకీనాఁడు పర సంతానవిధనపాపము సంప్రాప్తించుచున్నది. ఒకవేళ బాలునే తెచ్చియిచ్చిన- ఏల యీచింత నాకు?

తే. గీ. ఈశిశువు మున్నె చచ్చిపోయినది కాని
మఱల జీవించెనిది బాలు మహిమ వలన
అప్రభావంబె రక్షింప నగును నేఁడు
చావదీబిడ్డ చంపఁగా జాలఁడెవఁడు. **16**

కంస : బిడ్డను తెమ్ము యశోధరా.

ప్రతీ : ప్రభువుల యాజ్ఞ (నిష్క్రమించును)
(దారికనెత్తికొని ధాత్రియు రక్షిపురుషులును) ప్రవేశింతురు.

అందరు : మెల్లగ నడువుడమ్మా. ఇదె మధ్యమద్వారము. ప్రవేశింపుము.

ధాత్రి : (ప్రవేశించి) ఇదే శిశువు ప్రభూ. చాలసేపటినుండి రక్షించుచున్నాము.

కంసు : (బిడ్డను చూచి) ఈ శిశువు ముఖమునందు రాజలక్షణములు గాన్పించు చున్నవి. నాకును స్త్రీ వధ చేయవలసినంత గతిపట్టినది. (అని ఆబిడ్డను త్రసికొనఁబోవును)

ధాత్రి : మెల్లఁగ ప్రభూ మెల్లఁగ.

ద్వితీయాంకము

కంసు: శిలాప్రతిమ ఈకంసుఁడు. సాహసము చేయకతప్పదు

తే. గీ. ముని మధూకుని శాపసంజనిత యిద్ది
సప్తమంబగు గర్భ మానతికి దీనిఁ
జంపినంతనె నాకగు శాంతి గాన
చంపెదను దీనిఁ గరుణయుఁ జంపుకొనుచు 17

(త్రిసికొని నఱకి) ఏమి యీవింత!

తే. గీ. ఒక్క తుండెము పడెనేల నొక్కటద్దె
ఎగసె మింటికి, రెండుగా చీలి, శిశువు
ఇది జగత్తున జన్మింప హేతువిద్దె
శస్త్రజాలంబుచే నన్నుఁ జంపుటొకట. 18

ఓహో యిది యిప్పుడు -

తే. గీ. నిశిత శూలాగ్రమందున నిలచి బళిర
యేల తండ్రించుచున్నది బాల యిపుడు
నాశకాలంబు ప్రాప్తించు నాఁడు ప్రళయ
కాళరాత్రి జనించెడి కరణిఁ దోఁచు. 19

(కాత్యాయని సపరివారయై ప్రవేశించును.)

కాత్యాయని :

తే. గీ. సుంభమహిషనిసుంభులు సురిగిపోయి
అమరవర్గంబు హతశత్రువయి సుఖింప
నేను వసుదేవునింట జన్మించినాను
పేర కాత్యాయని యటంచుఁ బిలువఁ బడుదు. 20

కుండోదరుఁడు :

ఉ. నాదు పరాక్రమంబున రణస్థలి శత్రులఁ జీల్చునట్టి కుం
డోదరనాముఁడన్ భగవదూర్జితజన్మవిశిష్టవేళ్ళనే
రోదసి నిండునట్లులతిరూక్షనినాదముచేసినాఁడ నేఁ
డాదట రాక్షసాళి హతమార్పఁగ భూమికి వేగవచ్చితిన్. 21

శూలము ;

ఉ. శూలమనేను ఉజ్జ్వలము సుందరమౌ తనువొప్పఁబుట్టిదై
త్యాళి మథించి లోకము సుఖాన్వితమున్పొనరింపవచ్చితిన్
పోలఁగఁ గార్తికేయుఁడు సముద్రమునంగల తారకాసురున్
గాలుని పాలికంపినటుకంసుని నేఁబరిమార్తు నిచ్చటన్. 22

నీలము ;

తే. గీ. నేను సంగ్రామశూరుఁడ నీలనాముఁ
డను రణంబున వెనుదీయ నట్టి బలుఁడ
క్రౌంచమును స్కందునట్ల నిక్కంసహతకుఁ
గదన మందున గెల్తు నిక్కంబు నేఁడు. 23

మనోజవుఁడు ;

తే. గీ. దేవకార్యార్థ మిటకేఁగుదెంచునేను
మారుతసమానవేగుఁడ మహికి దిగితి
నే మనోజవుఁడను తృణనివహ మగ్నిఁ
గాల్చు రీతిని గెల్తు రాకసుల నెల్ల 24

కాత్యాయ ; కుండోదరా, శంకుకర్ణా మహానీలా, మనో జవా రండు ఖూరందహను. శ్రీమన్నారాయణుని బాల చరితము ననుభవించుటకు మనమందఱమును గోపాల వేషప్రచ్ఛన్నులమై ఘోషమునందవతరింతము.

అందరు ; దేవాజ్ఞ. (కాత్యాయుని పరివారముతో నిష్క్ర మించును.)

రాజు ; తెల్లవారినది.

తే. గీ. అగుట శాంతశర్మోచితమైన గేహ
మేను జొచ్చెద శాంత్యర్థ మిపుడు నాకు
శాంతి గలుగంగ జేసెద శాంతి పరస
మద్ధి యొనగూర్చు శాంతి నాకని తలంతు. 25

( నిష్క్రమించును )

(ద్వితీయాంకము సమాప్తము.)



# తృతీయాంకము

---

(వృద్ధగోపాలకుఁడు ప్రవేశించుచు)

వృద్ధగోపాలకుఁడు : ఓ కుంభదత్తా, ఓరీ మేఘదత్తా ఓ ఘోషదత్తా గోవులను మేపుఁడు బాగుగ. ఈ బృందావనములో మన గోవులు నీరు త్రాగి హుంభారవము చేయుచు వచ్చును. ఇదిగో యీ వృషభము గోశాల నుండి వెలువడి కొమ్ములతో పుట్టల నెగఁజిమ్మి నల్ల కలువపూమాలలో యున్నట్లు భయంకర వర్ణములు గల పాములు గొమ్ములపై వ్రేలాడుచుండ వింత గొల్పుచున్నది. అట మఱియొక యెద్దు తోకను సారించి జానువులఁ గుదించి చంద్రునివలె తెల్లనైన శరీరకాంతితో వాడియైన కొమ్ములతో భూమిని పెళ్ళగించుచున్నదో యున్నట్లు ప్రకాశించుచున్నది. ఇదే దామకుని పిలతును. ఓరీ దామకా గోవులను దూడలతోఁ గూడ ప్రమాదములేనిచోటఁ గట్టి యుంచి నీవిటు రమ్ము.

(దామకుఁడు ప్రవేశించుచు.)

దామకుఁడు : ఎన్ని పచ్చికబయళ్లు మా ప్రభుపు నంద

గోపునకు! కుమారుడు పుట్టిన నాటినుండియు సంతోషమధికతరమైనది మా పల్లెకే. ఈ గోవుల నిట నేయుంచి మామామకడకుఁ బోయెదను. (సమీపించి) నమస్కారము మామా.

వృ. గో: మనకును మన గోధనమునకును శాంతి గలుగుఁగాక.

దామక: మామా మననందగోపునకు కుమారుఁడు జనించిన నాఁటనుండియు రోగణము పశురోగమనునది యెఱుఁగదు. మన గొల్లపల్లె వారందఱును ఎంత యుత్సాహముగ నున్నారు! మామా ఇఁక పూలు పండ్ల సమృద్ధి ఇంతంతనిరానిది. పాలును నేయియుఁ గొల్లలు.

వృ. గో.: ఈ వింత వింటివా దామకా మన నందగోప పుత్రుఁడు పదిదినముల శిశువుగా నున్నపుడు పూతన యను రాక్షసి స్తనములకు విషము పూసికొని నంద గోపీవేషముతో వచ్చి శిశువు నోటియందు ఱొమ్ముంచినది పాలిచ్చు నెపముతో. దాని నెఱింగి బాలుఁడు క్రిందకుఁ ద్రోసెను. అదియు రాక్షస్యాకారము దాల్చి చచ్చి పడినది. మఱి కొన్నాళ్ళ కాశిశువున కొక్క మాసము నిండీ నిండక మునుపే శకటుఁడను రాక్ష

సుఁడు శకటరూపమున వచ్చెను. వానిని బాలుఁ డొక్క కాలితోఁ దన్ని పిండి పిండిగఁ జేసి వైచెను. వాఁడును రాక్షసాకారము దాల్చి చచ్చెను. తరువాత మాసము నిండిన యాశిశువొక్క యింటి లోనికేఁగి పాలు త్రావును మఱియొక్క యింటిలోఁ బెరుగు తినును. వేఱొక్క యింటిలోనికేఁగి వెన్న భక్షించును. ఇంకొక్క యింటిలోనికరిగి పాయసము జుర్రును. మఱియొక్క యింటిలోని తక్రఘటముపైఁ గన్నుంచును. ఇదిగని గోపికలు కోపించి నందగోపికి విషయమెఱింగించిరి. ఆమెయుఁ గినిసి యొక త్రాడు తెచ్చి బాలుని నడుమునకు బిగించి దానిని ఱోటికి గట్టిగఁ గట్టినది. తరువాత నేమి జరిగినదో తెలిసి నదా? బాలుఁడా ఱోటిని లాగికొనుచుఁ బోయి యమళార్జునులను రాక్షసులు జంటవృక్షముల రూపములతో నున్నవారి మధ్యగాఁ బోయెను. ఆ రెండు చెట్లును వ్రేళ్ళతోఁ బెళ్ళగింపఁబడి ఫటఫట విరిగి పోయినవి. ఆ రాక్షసులు తమ నిజరూపములతో నాశనమైరి. అదిగని మన గోపజనమంతయు బాలుఁడు బహుపరాక్రమవంతుఁడనియు నతనిని భర్తృదామో దరుఁడను పేరునఁ బిలువ వలయుననియు ననిరి.

## తృతీయాంకము

ఇంకఁ గొన్నిదినములకా బాలుఁడు పెరిఁగి కొంచెమించుకసటు పరుగెత్తు వయసువాఁడై యుండఁగ ప్రలంబుఁడను రాక్షసుఁడొకఁడు నంద్గోపునివలె వేషము వేసికొని బాలునికడకువచ్చి సంకర్షణు నెత్తికొని పాఱిపోవుచుండెను. వెంటనే బాలుఁడది యెఱింగి యారాక్షసుని తలపై నొక్క గ్రుద్దు గ్రుద్దెను. ఆ గ్రుద్దుతో గ్రుడ్లు బయటకువచ్చి వాఁడు రాక్షస రూపుఁడై చచ్చి పడెను. మఱొక్క నాఁడు బాలుఁడు గోపాలురతోఁ గలసి తాటిపండ్లు తినఁదలఁచి తాటితోపునకేఁగెను. అట ధేనుకుఁడను రాక్షసుఁడు గాడిదరూపముతో వేచి యుండెను. దానిని గూడ భర్తృదామోదరుఁడెఱింగి తనయెడమకాలితో త్రాటి పండ్లను బంతులవలెఁ నెగదన్ని గాడిదపైకి విసరెను. ఆ దెబ్బలతో నాగాడిద రాక్షసాకారము ధరించి గిర గిర తిరిగి చచ్చెను. ఆ తరువాత మఱియొక దానవుఁడు కేశి యనుపేరుగలాఁడు గుఱ్ఱము రూపముతో రాఁగ భర్తృదామోదరుఁడు మోచేతితో దానిడొక్కలో నొక్క పోటు పొడిచెను. ఆ పోటునకది రెండుగాఁ జీలి రాక్షసాకారము ధరించి యటనే పడినది. ఇటు లెన్నియని దామకా భర్తృదామోదరుఁ డొనర్చిన మహాద్భుతకృత్యములు!

దాము : అది సరిగాని మామా యిప్పుడు భర్తృదామోద
రుఁడీ బృందావనమున గోపకన్యలతో హల్లీసకము
నర్తించుటకు వచ్చుచున్నాఁడు.

వృ. గో. : అయిన గోపాలురమందఱము నాతని హల్లీసక
నృత్యమునఁ బాల్గొని యానందింతము.

దాము : అప్పుడు పోదము పద మామా (నిష్క్రమింతురు.)

(ప్ర వే శ న ము)

వృద్ధగోపాలకుఁడు ప్రవేశము.

వృ. గో. :

తే. గీ. నిత్యము ప్రభాతవేళ నాదిత్యుఁడుదయ
మందకయ మున్న సద్భక్తి నమృతపూర్ణ
ధేనుగణముల లోకమాతృకలఁ బూజ
సల్పుఁడు నిఖిలజనము శీర్షముల వంచి. 1

మా గొల్లపల్లె సౌభాగ్యమేమని చెప్పఁగలను! ఆడం
బర వేషములతో పటహముల ధరించి యందఱమును
వినోదించుట కేగుచున్నామిప్పుడు. ఇదె మాగోపికా
కన్యలు, రాపమ్మా ఘోషసుందరీ, ఎందుకు వన
మాలీ యాలసింతువు, ఇదిగో చంద్రరేఖా, విన

# తృతీయాంకము

నమస్కృత్యాక్షి, రంపు త్వరగ సేయుదము.

(అందరు వచ్చి) నమస్కారము స్వామీ,

వృ. గో.: వచ్చితిరా తల్లులారా ఇదుగో మన భర్త్రి దామోదరుఁడు ఆవుపాలవంటి తెల్లని శరీరముగల సంకర్షణునితోడను గోపాలురతోడను కలసి గుహ నుండి వెలికి వచ్చు సింహమువలె వచ్చుచున్నాఁడు! చూడుఁడు!

(గోపాలురతోఁ గలసి సంకర్షణ, దామోదరులు ప్రవేశింతురు)

దామోదరుడు: (ఆశ్చర్యముతో) సహజసుందరులైన యీ గోపకన్యకల వేషరామణీయకము కనులపండువొనర్చుచున్నది.

చం. వికసితపద్మపత్రముఖవీక్షణము ల్తపనీయ పుల్లసం
పకసదృశాంగరాగములఁ బ్రాభవమొప్పెడి గోపకన్యకల్
వికచ వనప్రసూనపరివేష్టిత కేశకలాపహస్త దా
మకములు దాల్చి యాడుదురు మాటలఁ దేనియ
లొల్కుచుండఁగన్.2

సంకర్షణుఁడు: ఇదే గోపాలురు వచ్చిరి.

ఉ. కొందఱు మోదితాత్ములఁ గొందఱు పంకజపత్రనేత్రలం
దందు భజించుచున్నవిహారము సేయుదు రందచందము
ల్పొందఁగ, గోగణంబులువిశృంఖలహుంభనినాదమిత్రమున్
క్రిందుగఁజేయగోపికలుగానమొనర్తురుకర్ణపేయమై.

వృ. గో.: అవును ప్రభూ, అందఱును క్రీడాసన్నద్ధులై యిట కేతెంచిరి.

దామకుఁడు: స్వామికి జయము.

సంక: గోపాలురందఱును వచ్చిరా దామకా.

దామ: అందరును వచ్చిరి స్వామీ, ఆటలకు సర్వసిద్ధముగ నున్నారు.

ధామో: ఘోషసుందరీ, ఇదిగో వనమాలా, చూడుమిటు చంద్రరేఖా, మృగాక్షీ నీవును వినుము. మన మంద అమును పల్లీజనుల కనురూపమైన 'హల్లీసకనృత్య మును జేయుదము.

అందరు: తమయిష్టప్రకారమే యాడుదము.
సంక: దామకా, యిదిగో మేఘవాదా డప్పులను వాయించుఁడు.
ఇద్దఱును: అల్లో

వృ. గో.: మీరు హల్లీసకమాడుచో నేనేమి చేయుదును స్వామీ.

దామోదరుఁడు: చూచుచునుండుము తాతా.

వృ. గో: చిత్తము ప్రభూ.

(అందఱు నృత్యములు చేయుదురు.)

వృ. గో: భళిభళీ! ఏమిపాట! ఏమిగానము! వాద్యముల మ్రోయింపులేమి! ఎంత కనువిందైననాట్యమిది! నేను గూడ నాడెదను. కాని నేను అలసిఁయుంటినిది చూచి చూచి.

గోపాలకుఁడు ప్రవేశించును.

గోపాలకుఁడు: అయ్యో, అయ్యో ప్రభూ పాఱిపోండిటనుండి పాఱిపోండు వేగము.

దామోదరుఁడు: ఏల ఈభయోద్వేగములు బాలకా

గోపాలకుఁడు: ఇదుగో స్వామీ యీయరిష్టవృషభుఁడను రాక్షసుఁడు పిట్ట పిడుగువలె తనగిట్టలతో భూమిని గీఱుచు వచ్చుచున్నాఁడు. వీనిఱంకె మేఘగర్జనమని భయము వొడముచున్నది.

దామో: అదియా విషయము సరి, ఆర్యసంకర్షణా నీవీ గోప కన్యలను గోపబాలురను దీసికొని పోయి యీసమీప

పర్వతాగ్రమున నుండును. దురాత్ముఁడైన యీ యరిష్టవృషభునితో నా పోరాటమును జూచు చుండుము.

(అందరితో సంకర్షణుఁడు నిష్క్రమించును.)

దామోదరుఁడు: ఇదుగో దురాత్ముఁడరిష్టర్షభ రాక్షసుఁడు.

తే. గీ. క్రుళ్ళగించుచు నేలను ఖురముకొనలఁ
గూల నేయుచుఁ దటములఁ గొమ్ముకొనల
వ్యగ్రదృష్టుల గోపులు భయము చెంద
ఱంకె వేయుచు వృషభుఁడీవంకె వచ్చు. 4

(అరిష్టర్షభుఁడు ప్రవేశము.)

అరిష్టర్షభుఁడు: వినుండో హో

శా. ఆకాశంబటు శృంగకోటులను వ్రయ్యన్ స్థూలదేహంబునన్
~~సంకోచించుచు మాని ఈ~~ నిల్చి లా వృషభవేషచ్ఛన్నరూపుండనై
వీఁకన్ బృందవనమ్ము గర్జనల నాభీలమ్ముగాఁజేసి యు
ద్రేకప్రాప్తితబాహువిక్రమతఁగూల్తున్‌శత్రువున్నేఁడిదే. 5

మఱియు,

కం నారంకె వినిసయంతన
యీరామల గర్భస్రావ మింతట నయ్యెన్
ధారుణియుఁ గంపమొందెడి
కారడవులు చెట్లు కూల ఖరఖురనిహతిన్. 6

ఆనందగోపకుమారుఁడెక్కడ? ఓ హో నందగోప కుమారా యెచట నుంటివి?

దామో: ఓరీ గోవృషాధమా చూడు మీ ప్రక్క

అరిష్ట: (చూచి) ఏమిది!

తే. గీ. ఏల ఁజలియింపకుండె నీబాలుఁడిపుడు
భయదవేషుని నను ఁ జూచి బడలు వడఁడు
విస్మితుఁడు గాఁడు నా అంతె విని యిదేమొ
అధికబలవంతుఁడౌను సత్యమ్మితండు. 7

దామో:

తే. గీ. వెఱపనుపదంబు నీనోట వింద నేఁడె
భీతచిత్తులకభయప్రదాతనగుచు
నిధరాతలమున జనియించినాను
భయపడఁగనేల నీవేషభాషణముల. 8

అరిష్ట: బాలురకు భయమెట్లు తెలియునోయి.

దామోదర: ఓరీ గోవృషాధమా నేను బాలుఁడననియా నీ తిరస్కారభావము-

తే. గీ. బ్రతుకు నెవ్వడు జగతిని బాలకృష్ణ
సర్పదష్టుండు, ఎఱుఁగవో స్కందుఁడపుడు
బాలవయసున నుండఁగా ఁగూలనేసె
క్రౌంచమను పర్వతంబును ఘనత మీర. 9

అది యటులుండనిమ్ము,

కం. మణియొకటి వినుము, మూర్ఖా
గరగరమను కఠినశిలలు గలిగిన శైలం
బెరియుట వినమే మును
వరపల్లవమాత్రమైన వజ్రముతోడన్. 10

అరిష్ట: మాటలు చాలించితివేమోయి నందగోపపుత్రా

దామో: నిన్నుఁ జంపుటకు.

అరిష్ట: శక్తుఁడవే నీవు ?

దామో: సందియమా?

అరిష్ట: అయిన ఁజేతదాల్పుము నీకుచితమైన శస్త్రమును

దామో: శస్త్రమా, ఓరీ

ఉ. సారములేని నీచుఁడవు శస్త్రము కావలెనందువివ్వు, దు
ర్వారగిరీంద్రసానుపరిఖాసితమధ్యన బాహుసారమే
పారెడి శస్త్రమిత్తఱి, బలాఢ్యము మద్భుజదండమిప్డు ని
న్నోరను జంపదేని మనఁబోలునె నాకిల నాదుపేరిటన్. 11

అరిష్ట: అయిన యుద్ధము చేయుము.

దామో: ఓరీ గోవృషాధమా నాకాలి నొక్క-దానిని గద
లింపుము నీకు శక్తిగలదేని.

అరిష్టు: ఇదియు నొక ఘనకార్యమా (కదలింప యత్నించి మూర్ఛితుఁడై పడును)

దామో: భయపడకుమోరీ స్వస్థచిత్తుఁడవు గమ్ము. ఈ మాత్రపు బలమునకేనా యింత గర్వము నీకు!

అరిష్ట: (సమాశ్వాసమునంది తనలో)

తే. గి. ఇతఁడు సురరాజు పురుహూతుఁడేమొ లేక
శంకరుండేమొ లేక కేశవుఁడ యగునొ
ఏల వ్యర్థంపు తర్కంబు లిపుడు నాకు
ఇతఁడు సాక్షాత్తు విష్ణువే యిది నిజంబు 12

మఱియు,

కం. ఇందు జనించె నితండపు
డందున్ జనియించె నాఁడు హరి యిది నిజమౌ
ఎందెందు మేము పుట్టిన
అందందే పుట్టు దానవాంతకుఁడగుటన్. 13

కానిమ్ము. విష్ణుదేవుని చేతఁ జచ్చితినయేని నాకుఁ బుణ్యలోకప్రాప్తియే గల్గును. కావున యుద్ధమే చేసెద వీనితో (ప్రకాశముగ) నందగోపపుత్రా దృప్తుఁడనే యింకను. నీతో యుద్ధము చేసియే తీరుదును.

దామో: ఇంకను మదాంధుఁడవేనా?

తే. గీ. వానాకాలంపు మేఘంబు భాతినేల
గర్జనము సేయ రాకస, కాచికొమ్ము
వజ్రహతమౌచు సంజనపర్వతంబు
కూలినట్టుల భువి నిన్ను గూల నేతు. 14

(పడ వేసిచంపును) ఇదే చచ్చె నీదురాత్ముఁడు.

ఉ. మోమును నేత్రముల్ రుధిరపూర్ణములైనవి, మూపురంబు ను
ద్దామమునైన వాలము పదంబులు కర్ణములున్ జలించెడిన్
భూమిని గూలెఁ బ్రాణములు పోయెదురాత్ముఁడితండు పు
త్రాముని పజ్రభిన్నత ధరంబడు నంజనపర్వతంబునాన్. 15

(దాముకుఁడు ప్రవేశించును)

దాముకుఁడు: జయము స్వామీ, ప్రభువు సంకర్షణుఁడు యమునా హ్రదములో కాలియుఁడను మహానాగ మున్నదని తెలిసికొని పర్వతమునుండి దిగి యమున వైపునకుఁ బోయెను. అతనిని వారింపుము స్వామీ,

దామోదః: నేనును వింటి నాకాలియుఁడను సర్పము దర్ప ముతో విజృంభించుచున్నదని. కానిమ్ము వానిగర్వమిదే యణఁచెదను.

తే. గీ. ఆదురాత్ముండు గోబ్రాహ్మణాదిసర్వ
జనుల హింసించుచుండుట సత్యమిద్ది
నేఁడ శమియింపజూతునా నిష్ఠురాత్ము
శాంతిగల్గుత లోకంబు సర్వమునకు. 16

(నిష్క్రమింతురు.)

(తృతీయాంకము సమాప్తము.)

# చతుర్థాంకము

(దామోదరుఁడు ప్రవేశించును.)

దామోదరుఁడు :

ఉ. వీరె చకోరశాబనమవీక్షణముల్గల గోపికాంగనల్
చారుపయోధర ల్విపుల్రనస్తశిరోజములున్ ప్రకంపితో
ష్ఠారురుచుల్గలారయి సముజ్జ్వలవేష్టితవస్త్రయుగ్మమున్
జారఁగ నన్ను వెస్టవిలినారిదెకాళియుసర్పభీతలై. 1

(గోపకన్యకలు ప్రవేశింతురు )

గోపికలు: వలదు స్వామీ వలదీ జలాశయమును ప్రవేశింప కుఁడు. ఇది దుష్టసర్పనివాసము.

దామో: విషాదమేల ఇదె చూఁడుడు.

ఉ. ఈయమునాస్రవంతి పరిహీనవిహంగమయూథమై ఖయా
మేయవికంపిదంతికరమ్మృష్టజలంబును నైసదిప్పుడీ
తోయములన్గలంచి మధుతుందిలమైద హితోక్తి గోపికల్
ఈయదికూడదన్నెనెఱియించెద పట్టైదఁ గాళియున్ ఖలున్. 2

గోపి : సంకర్షణప్రభూ నీవైనను వారింపుము దామోదర స్వామిని.

(సంకర్షణుఁడు ప్రవేశము,)

సంకర్షణుఁడు: భయవిషాదములేల మీకు గోపికలారా, మీ యనురాగమునకు కృతజ్ఞులము. చూడుఁడిదే.

చం. తనముఖకోటినుండి పరితఃప్రకటీకృతదుర్విషాగ్నుల
స్తనలఁగఁ జేయు దిక్కులను గాళియుఁ డీయెడ దుర్విషప్లుఁడీ
తనిఁ బొలియింపనేఁగెడు నతర్కితవేగుని గృష్ణుఁ జూచి వం
దనముల నాచరించు బయనమ్రశిరస్కుఁడు కాళియుండహో 3

గోపి: దామోదరప్రభువంతటివాఁడే.

దామో: విశ్వకల్యాణమునకై యిదే యీ సర్పమును వేగ ముగ వశపఱచి కొందును.

(హ్రదమునఁ బ్రవేశించును.)

అందఱు: అయ్యో పొగలు వెలువడుచున్న యీహ్రదము నుండి.

దామో : ఎంతటి లోతీ హ్రదము, ఇక్కడ

తే. గీ. ఇంద్రనీలసమోర్ముల నెనఁగి నల్ల
పట్టుపుట్టంబుతో సరివచ్చు హ్రదము
కాలియుని విషధూమ సంకలితమౌర
ఈవిషాగ్నులు శాంతించు నిదె గనుండు. 4

(నిష్క్రమించును.)

(వృద్ధగోపాలుఁడు ప్రవేశించును.) అయ్యో! గోప కన్యలు వలదన్నను ప్రభువు హ్రదమును ప్రవేశించెను.

వృ. గో: సాహసము కూడదు స్వామీ. వగాహాములు పెద్దపులులు నేనుఁగులును నీహ్రదములోని నీరు త్రాగి యిచటనే చచ్చినవి. (చూచి) ప్రభువు కన్పించఁడేమి? ఏమియుఁ దోచకున్నది. కానిమ్ము కుంభ పలాశ వృక్షము నెక్కి గమనింతును. (చెట్టునెక్కి చూచును.) అయ్యో పొగలు వెలువడుచున్నవి హ్రదమునుండి!

సం: చూడుఁడు మీరందఱును.

తే. గీ. కాలియునిబట్టి తోయంబు కలచి వాని
భోగమందున నిలచె దామోదరుండు
కారుమేఘాలపై శచీకాంతుఁ బోలు
నీలసర్పంబుపైనున్న బాలుఁడిపుడు. 5

వృ. గో: ఎంతటి మహాకార్యమొనర్చెనీప్రభువు!

(కాలియుని బట్టికొని దామోదరుఁడు ప్రవేశించును)

దామో: ఇదే చూడుఁడు

తే. గీ. దర్పితుండైన కాళియుతలను పాద
మొకటి పెట్టితి. వైజయంతికను బోలె
బాహువెత్తి విషోల్బణఫణమునందు
లీలఁనర్తింతునేను హల్లీసకంబు. 6

అందరు: ఇదేమి వింత కాళియుని పడగ లైదింటి నాక్రమించి స్వామి హల్లీసకనృత్యమును జేయుచున్నాఁడు.

దామో: ఇపుడే పూలను కోయుదును.

కాళింగుఁడు: ఆఁ.-

శా. ఏశైలంబటు మన్నుఁగప్పినది యాసృష్టిన్ మనాంధ్యమ్ముసన్
పాశంబై ఫణి దానిఁగట్టినది యూపాదోధినిన్ దృచ్చునాఁ
డాశక్రేభకరమ్ముసట్లు కరిసంబై యొప్పు భోగమ్ముల
న్నిశౌర్యమ్మిపెత్రుంచి కొందు ససువుల్ నిక్కంబు దామోదరా. 7

నృ. గో: ఆశ్చర్యమాశ్చర్యము! ఈప్రభువు కుసుమకోమలము లైనతనపాదద్వంద్వముచే యమునలో నున్నమహా నాగమును త్రొక్కుచుఁ గుసుమములఁ గోయు చున్నాఁడు. త్రొక్కుము స్వామీ త్రొక్కివేయుము ఈ దుష్టసర్పమును నేనును సాయపడెదను— నాకు భయము వేయుచున్నది ప్రభూ. అయిన నీవిషయము నిదే నందగోపునకు దెల్పుదును.

(నిష్క్రమించును)

దామో: తే. గీ. యమునలోనుండి నక్రమీనముల నెల్లఁ
గాటువైచెను ఎత్తుఁడీ కాళియుండు
వెలికి గ్రక్కను పూత్కారములను వీసఁ
బట్టి తోంతును గట్టునఁ బాఱ వైతు. 8

కాళీయుఁడు: ఓయీ,

తే. గీ. తీవ్రరోషాగ్నితప్తమద్దేహవాహ
మవని యెల్లను మాడ్చి వేయంగఁగలదు
ఈమహాజ్వాలలే నిస్సహాయింపఁగలవు
ఇహపరంబుల నిన్గాప నెవఁడు గలఁడు. 9

దా: నీకంతటి శక్తి గలదేని నా భుజమొక్కటి సహింపుము కాళీయుఁడా.

కా: హా హా హా, హా హా హా

కం. నాలుఁగు చెఱఁగుల నేలను
పోలఁగ గులపర్వతాళిపూరితజగమున్
లీలఁగ దగ్ధము చేయఁగఁ
జాలుడు నీబుజము గాల్పశక్తుఁడఁ గానే. 10

ఆగుమిప్పుడు నిన్నిదే భస్మము చేయుచున్నాను. (విషమును విడుచును.)

దామో: నీపరాక్రమమంతయుఁ జూపితివిగదా!

కాళీయుఁడు: (నమ్రుఁడై) దేవా శ్రీమన్నారాయణా అనుగ్రహింపుము.

దామో: ఇట్టి యీపరాక్రమముచే నీవు దృప్తుఁడవైతివా కాళీయా?

కాళియుఁడు: అనుగ్రహింపుము దేవా,

తే. గీ. కలదు గోవర్ధనము నెత్తఁగల బలమ్ము
సారవంతము మందరశైల పటుల
నీదుబాహువు నాతరమే దహింప
మజ్జగంబుల కియ్యది ప్రాపు దేవ. **11**

స్వామీ! అజ్ఞానమదాంధుఁడను. క్షమింపుము. నాయంతఃపురజనముతో నిదే శరణాగతుఁడనైతిని.

దా: కాళియుఁడా నీవీయమునా హ్రదమును జొచ్చుటకుఁ గారణము?

కాళియుఁడు: తమవాహనమగు గరుడునివలన భీతిచే స్వామీ, గరుడభయమును దొలఁగింప నభయ మీవేఁడుదును.

దా: అట్లె యగుఁగాక.

తే. గీ. నాదు పాదచిహ్నితమాయె నీదు శిరము
దీని గన్నంత గరుఁడుండు తృప్తి చెంది
కరుణ నీకిచ్చు నభయంబు, గలుగదింక
గరుడభయ మెప్డు ఘోరమ్ముఁకఁ గాళియుండ. **12**

కాళియుఁడు: అనుగ్రహింపఁబడితిని.

దా: నీవిఁక హ్రదములోనికిఁ బొమ్ము.

కాళి: చిత్తము, భగవదాజ్ఞ.

(పోఁబోవును)

దా: అయిన నిటు రమ్మొకసారి.

కాళి: ఆజ్ఞ దేవా.

దా: నేఁటు మొదలుగ గోబ్రాహ్మణులకుఁగాని తదితరప్రజా నీకమునకుఁగాని యెట్టి ప్రమాదమును దలఁపఁగూడదు సుమా.

కాళి: దేవా, యీయమునాజలము మద్విషదూషితము. కాన విషమునుపసంహరించి నేనిందుండి వేరొక యెడకుఁ బోయెదను.

దా: మంచిది, వెడలిపొమ్మిటనుండి.

కాళి: శ్రీమన్నారాయణుని యాదేశము (సపరివారుఁడై నిష్క్రమించును)

దా: ఈహ్రదమునందు నేఁగోసిన పుష్పములను గోప కన్యలకిత్తును. (నడచును.)

గోపకన్యలు: ఇదే ప్రభువు దామోదరుఁడు! క్షేమముగా నిటు వచ్చుచున్నాఁడు. ప్రభువునకు విజయము.

సంకర్ష: గోబ్రాహ్మణహితము జరుగుట మహాభాగ్యము.

దా: ఇవిగో కుసుమములు తీసికొనుఁడు.

గోపికలు: ఈ పుష్పముల నింతవరకు మహర్షులెవ్వరును గోయనేలేదు స్వామీ. ఎవ్వరును వీనిని స్పృశింపను

లేదు. సూర్యచంద్రకిరణములుగూడ నీనిపై సోక లేదు. ఇట్టి ఘోరకుసుమములఁ గైకొన భయమగు చున్నది ప్రభూ

దా: పాపము మీరింతవఱకో భయపడి యుండిరి గాన నిప్పుడు నన్నే భయాకులితలగుచున్నారు. నేను స్పృ శించితిఁగదా! నీనికి సౌమ్యభావము సంప్రాప్తించి నది. కానఁ దీసికొనుఁడు. (ఇచ్చును.)

గోపికలు: చిత్తము. (తీసికొందురు)

( భటుఁడు ప్రవేశము )

భటుఁడు: ఓగోపాలకా, ఎక్కడ ఆనంద గోపపుత్రుఁడు!

గోపాలుఁడు: ఇదిగో యిక్కడనే. కాళీయుఁడను దుష్టసర్ప మును జంపి గోపకన్యకలతో నిచటనే విహరించు చున్నాఁడు.

భ: నందగోపకుమారా, అన్వర్థనామధేయుఁడైన ఉగ్రసేన పుత్రుఁడు కంసరాజు నిన్నాజ్ఞాపించుచున్నాఁడు.

దా: అతనియానతి యేమి నాకు?

భ: మధురానగరమున ధనుర్మహమను మహోత్సవము జరుగనున్నది. ఆమహోత్సవమును జూచుటకై నీవు సపరిజనుడవై రానలయునని వారియాజ్ఞ.

చతుర్థాంకము

దా : ఆర్యసంకర్షణా యిదేగదా దేవరహస్యకాలము!

సంకర్ష : అయిన మనము వేగముగ నేఁగుదము.

దా : తప్పక యేఁగ వలయును.

తే. గీ. రత్నమకుటుంబు దొర్లి ధరంబడంగఁ
గేశములు హారములు త్రెవ్వఁ గీటడంతుఁ
గంసు దుష్టుని నేఁడె నాగంబు నిట్టి
ఘనమృగేంద్రము పొలియించుకరణి నేసు. 13



దానిని దీసికొని రాజమంటపాభిముఖుఁడై వెళ్ళెను.
ఆ బాలుఁడు

తే॥ గీ॥ నెమలిపింఛంబుఁ బుష్పదామములు దాల్చి
మృత్యువో యన రోషరక్తేక్షణుఁడయి
చుట్టి పీతాంబరము సద్విశోభితాంగుఁ
డగుచు వచ్చెడి రాముఁడు సనుగమింప. 3

రాజు: ఏల నాహృదయమిట్లు దడదడ కొట్టుకొనుచున్నది? పొమ్ము నీవు మాయాజ్ఞగ చాణూరముష్టికుల రమ్మనుము. వృష్ణి కుమారులకును జెప్పుము యుద్ధసన్నద్ధులు కండని.

భటు: చిత్తము (నిష్క్రమించును)

రాజు: నేనిదే ప్రాసాదము నెక్కి చాణూరముష్టికుల యుద్ధము తిలకింతును (ఎక్కి)
ద్వారమును దెరువుము మధురికా,

ప్రతీహారి ప్రవేశించి)

ప్రతీ: చిత్తము (అని తెఱచును)

((ప్రవేశించి రాజు ఆసీనుఁడగును)

(చాణూరుఁడు, ముష్టికుఁడును, భటుడును ప్రవేశింతురు.)

చాణూరుఁడు :

కం॥ మత్తిల్లిన కరిభంగిని నే
నిత్తఱి దృప్తుండ నాజి నెంతయు నేర్తున్
చిత్తంబు తత్తరింపఁగ
సత్తువ నీబాలకృష్ణుఁ జంపెద లీలన్, 4

ముష్టికుఁడు :

తే. గీ. ముష్టికుండనుపేరున దుష్టుఁడ నయి
లోహమయముష్టకరముల నాహవమున
రాముఁ జంపెద నేను, వజ్రంబు పర్వ
తాగ్రకూటంబుఁ బడవైచినటుల నిపుడు. 5

భటు: ఇదె మహారాజు. సమీపింపుఁడు మీరిద్దఱును.

ఇరు: విజయము మహారాజులకు.

రాజు: చక్రవర్తి ఋణముదీర్చికొనుటకన్నివిధముల యత్నింపుఁడు మీరిరువురును.

ఇరు: మల్లయుద్ధవిశేషముల నన్నింటిని జూపి తప్పక కృతకృత్యుల మయ్యెదము ప్రభూ!

రాజు: ఆవశ్య మట్లే చేయుఁడు. గోపబాలకుల రమ్మనుము ధ్రువసేనా

భటు: చిత్తము (నిష్క్రమించును)

(దామోదర, సంకర్షణులు ధ్రువసేనునితోఁ బ్రవేశింతురు.)

దామోదరుడు :

తే॥ గీ॥ పుట్టె మఱిజన్మమున దానవుండు నగుచు
కంసుఁ డితనిఁ జంపినకాని నాకు
సంతసము నీదు మధుర, ఘోషంబు నందుఁ
బనులు నేఁజేసినవి వ్యర్థమని తలంతు. 6

సంకర్షణుడు :

తే. గీ. లోహముష్టుఁడై రంగము లోన మిగుల
రుష్టుఁడైయున్న ముష్టికు ముష్టిఘాత
ములను వధియింతు నంభోదములను జీల్చు
చండవాతంబు వోలెఁ బ్రచండగతిని 7

భటుఁడు : వీరే మహారాజు లాసీనులై యున్నారు. దగ్గఱకుఁ బొండు మీరిద్దఱును.

ఇద్దరు: ఏమి, ఎవ్వనికీతఁడు మహారాజు?

భటుడు : యావద్విశ్వమునకును మాకును గూడ.

దామో : అట్లు కాదీ నాఁటినుండియు.

భటుఁ : మహారాజులకు జయము. ఇదే వీరేవారు ప్రభూ.

రాజు : (చూచి) ఈతఁడా ఆదామోదరుఁ డనువాఁడు! ఆశ్చర్యము.

శా॥ శ్రీమంతుండును మత్తదంతివతిమ స్ఫీతప్రశాంతస్ఫురత్
స్థేమంబున్ స్థిరపీనబాహువులునున్ దీప్యద్విశాలోరమున్
శ్యామంబైన తనూరుచుల్ మెరయు నాహా వీని చారిత్రముల్
నేమున్వింటిని చిత్రమే! యితఁడు పాలించున్ త్రిలోకంబనన్. 8

లలిత గంభీరాకృతిగల యీరెండవ యాతఁడితని యన్నయగు రాముఁడట !

తే. గీ. కమలపత్రాయతాక్షుండు కమలవైరి
సదృశ రూపుండు నీలవస్త్రంబుఁ దాల్చి
పరిఘసమదీర్ఘబాహుఁడై పరఁగు నితఁడు
నల్లకలువపూమాల కంఠమునఁ దాల్చు 9

దామో : ఆర్యసంకర్షణా. వీరిరువురేనా మనతో యుద్ధము చేయ సిద్ధముగ నున్నవారు ?

సంకర్ష : అట్లే కన్పించుచున్నది.

రాజు : యుద్ధము కానిమ్ము ధ్రువసేనా.

భటుఁడు : చిత్తము. (మాలను విసరును.)

చాణూరముష్టికులు : మ్రోయింపుఁడు యుద్ధభేరులను,

చాణూరుఁడు : రావోయి దామోదరా నాభుజయుగళమున నలిపివేయుదును.

దామో : (చాణూరునితో)

తే. గీ. నిలచినాడఁను చూడు నాబలము నిపుడు.

ముష్టికుఁడు: ఓయి రామా! నాపిడిగుద్దులతో నిన్నిప్పుడు పిండిగొట్టి రక్తమాంసములు పైకి లాగి చంపి పార వేయుదును రమ్ము.

సంకర్ష:

ఓరి ముష్టిక, యమపురి నుంటివిదుగో

(అందఱును గలియఁబడి మల్లయుద్ధము చేయుదురు)

దామో: (చాణూరుని జంపి)

అస్థులన్నియు నుగ్గయె,

సంకర్ష: (ముష్టికునిజంపి)

హతుఁడు వీఁడు

దామోదరుడు :

అసురఁ గంసుని యమపురి కంపుదీపుడు. 10

(ప్రాదముసెక్కి కంసుని తలను బట్టి క్రిందఁ బడవేసి)

దురాత్ముఁడగు నీకంసుఁడు

చం. కరములు జానువుల్తొడలు ఖండితము ల్వదనంబు రక్తమే
దురమును నేత్రముల్వెలికి త్రుక్కిన పితని హారపంక్తులున్
ధరఁ బడె ఛిన్నమై, యధిక దర్పితుఁడీ దనుజేంద్రుఁడాపురం
దరభిదురప్రభిన్న వసుధాధరమట్టులఁ గూలె నిత్తఱిన్. 11

(తెరలో)

---

(10-వ పద్యము.)

తే. గీ. నిలచివాఁడను జూడు నాబలము నిపుడు
ఓరి ముష్టిక యమపురి మంటి విదిగో
అస్థులన్నియు నుగ్గయె హతుఁడు నీఁడు
అసురఁ గంసుని యమపురి కంపుదిపుడు. 10

అయోధ్యా మహారాజు.

(మఱల నేపథ్యములో)

వృష్ణియోధులారా, అనావృష్టి శివక హృదిక పృథుక సోమదత్తాక్రూరాది యోధులారా రండు వేగము, ఇదే మహారాజు ఋణమును దీర్చికొను సమయము. రండు వేగ.

దామో:: ఈసేనను నివారింపుము ఆర్యసంకర్షణా.

సంక: ఇదే ఒక్క యడుగు ముందుకు వేయ నీయను.

తే. గీ. రథతురగ గజవేగ విభ్రాంతమగుచు
ప్రాస కుంతాదికాయుధ పాణియైన
సేన క్షోభింపఁ జేయుదు, ఫేనవీచి
కాయుత జలధిఁ బవనంబు కరణి నిపుడె. 12

(వసుదేవుఁడు ప్రవేశించును)

వసుదేవుడు: ఏల ఈసాహసము మధురావాసులారా!

తే. గీ. ఇతఁడు నాజ్యేష్ఠసుతుఁడు రోహిణికిఁ బుట్టె
ఇతఁడు దేవకి ముద్దుల సుతుఁదు వినుఁడు
ఏల ధరియింప శస్త్రంబు లిపుడు మీరు
విష్ణువే కంసుఁ జంప నావిర్భవించె. 12

సంకర్ష. (చూచి) ఏమిది పితృపాదులు విచ్చేసినారు! సంకర్షణాభిధానుఁడనిదే నమస్కరించుచున్నాను తండ్రీ.

దామో: దామోదరనాముఁడ నిదే ప్రణమిల్లుచున్నాను పితృపాదపద్మములకు.

వసు: సదా విజయవంతులు గండు. నేఁడుగదా నేను సత్పుత్ర జన్మసాఫల్యము నందఁ గంటిని,

ఇద్దఱు: అనుగ్రహింపఁ బడితిమి.

వసు: ఎవఁడక్కడ.

(భటుఁడు ప్రవేశించును)

భటు: ఆర్యపుత్రులకు జయము.

వసు: ఈకళేబరముల నావలఁ బార వేయుము.

భటుఁడు : చిత్తము. (నిష్క్రమించును.)

గోపాలకులందఱు: హ్హా హ్హా హ్హా. గోపాలక రాజ్యమైనదిప్పుడంతయు.

వసు: ఎవఁడక్కడ.

(భటుడు ప్రవేశము)

భటు: జయము పూజ్యపాదులకు.

వసు: ఇదె దామోదరుని యాదేశము. ఉగ్రసేనుని చెఱనుండి విడిపించి మధురారాజ్యాభిషిక్తుని జేసి ప్రవేశపెట్టుము. పొమ్ము వేగముగ.

భటుఁడు: చిత్తము. (నిష్క్రమించును.)

వసు: (వినుచు) ఏమిది?

కం. మొరయును సురతూర్యములిదె
కురియును వర్షంబు కుసుమగుచ్ఛముతోడన్
దురితుఁడగు కంసుఁ జంపిన
వరకృష్ణుని గొలువ నిటకు వత్తురు త్రిదశుల్. **14**

(నే పథ్యమున)

ఉ. శ్రీకరమై కనత్కనక చిత్రిత హర్మ్యసుశోభితంబునై
ప్రాకటరాజ హర్మ్య పణభాసురమౌ మధురాపురంబు. ము
ల్లోకములన్జయించు సురలోకపరుం డమరేంద్ర పాలకుం
డీ కమలాక్షుఁడోముత మహన శుభంబుల నెల్లకాలమున్. **15**

వసు: ఓ మధురానగరవాసులారా వినుండు. దైత్యేంద్ర పురార్గళోత్పాటనపటిష్ఠుఁడై సర్వ విజయుఁడై వసుదేవునకుద్భవించిన యీ వాసుదేవుని యనుగ్రహము వలన ఉగ్రసేనమహారాజు తిరిగి రాజ్యాభిషిక్తుఁడాయెను. ఇపుడిట నాతనిశాసనమే ఘోషింపఁబడుచున్నది.

అందఱు: వృష్ణిరాజ్యము స్థాపితమైనదిపుడు.

వసు: మహారాజును ప్రవేశపెట్టుఁడు.

భటుఁడు: చిత్తము. (నిష్క్రమించును.)

(ఉగ్రసేనుఁడు ప్రవేశము.)

కం. పురుహూతు నపుడు విష్ణువు
కరుణించినకరణి నేఁడు కంసాంతకుఁడున్
కరమరుదుగ నన్గాచెను
వరకృప, నా భాగ్యమెన్న వశమే యింకన్ 16

భగవదనుగ్రహామువలనఁ గష్టసముద్రమును దాటఁ
గల్గితిని.

(నారదుఁడు ప్రవేశించును.)

క. ఇదె కంసుఁడు మరణింపఁగ
త్రిదశేంద్రుని శాసనమున దేవతలెల్లన్
ముదమున నచ్చరలేమలు
కదియఁగ నరుదెంచిరిపుడు గంధర్వులతో. 17

దామో: ఆహా దేవర్షి నారదుఁడు! దేవర్షీ స్వాగతము.
ఇవే యర్ఘ్యపాద్యములు. (ఇచ్చును.)

నారదుడు: అన్నియు గ్రహింతును. గంధర్వాప్సరసలు పాడు
చున్నారు దేవా.

నారాయణ నమస్తుభ్యం
కారుణ్య పయోధి దేవగణ సంసేవ్యా
ధారుణిఁ గాచితివయ్యా
యారాకసుఁ గంసుఁ జంపి యిత్తఱి దేవా 18

దామో: సంతృప్తుఁడనైతిని:– దేవర్షీ. ఇంకను ప్రియమేమి
చేయఁగలను మీకు

నారదుఁడు:

తే. గీ. విష్ణుదేవుండు నాసేవఁ బ్రీతుఁడేని
నాపరిశ్రమ సఫలమైనదిగఁ దలఁతు
పోదు నిప్పుడ స్వర్లోకమునకు నేను
విబుధవరులెల్లరిపుడు నావెంటరాఁగ 19

దామో: దయచేయుఁడు. పునర్దర్శనమగుఁ గాక.

నార: భగవంతుఁడగు శ్రీమన్నారాయణుని యాజ్ఞ.

(నిష్క్రమింతురు)



## భరతవాక్యము

తే. గీ. వింధ్య హిమవద్గిరీంద్ర సంవేష్టితమును
జలధిరశనయునైన యీసకలధరణి
వరలుఁ గావుత మేకాతపత్రయగుచు
రాజసింహుండు గాచుత రమణ మీర

అందఱును నిష్క్రమింతురు.

బాలచరితము : : సంపూర్ణము

బాలాజి ప్రింటర్స్, నెల్లూరు,

# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ii | 5 | నాఁటినుక | నాఁటిదనుక |
| 21 | 5 | ఘూర్ణితంబగు | ఘూర్ణితంబగు |
| 26 | 10 | భూలోకంబును | లోకంబందున |
| 30 | 5 | వల | వలన |
| 32 | 3 | వేషు | వేళ |
| 33 | 13 | ద్వితీ | ద్వితీయాంకము |
| 42 | 13 | సంకోచంబనుమాని | సాకూతంబుగనిట్టులీ |
| 43 | 6 | వేఘుని | వేషుని |
| 46 | 14 | అదురా | అదురా |
| 52 | 14 | గరుఁశుంగు | గరుడుండు |
| 65 | 3 | కురియురు | కురియును |
| 68 | 2 | నింధ్య | వింధ్య |

